౧. విచారింపఁ దగినదిగాఁ జెప్పఁబడిన బ్రహ్మము ఏది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు-

సూ॥ జన్మాద్యస్య యతః ॥౨॥

అర్థము॥ అస్య జన్మాది యతః = దీనియొక్క పుట్టుక మొదలగునది దేనివలననో, తత్ బ్రహ్మ = అది బ్రహ్మము.

౨. జన్మాది అని సృష్టిస్థితి ప్రళయములు చెప్పఁబడుచున్నవి- ఇది తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి- (బహువ్రీహిసమాసము రెండు విధములు- ౧ తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి- ౨ అతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి- తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి యెట్టిదనినను, లమ్బకర్ణః ఇత్యాదికము- లమ్బకర్ణమ్ ఆనయ = వ్రేలాడుచున్న చెవులు గలదానిని తెమ్ము అనునప్పుడు అది వచ్చునప్పుడు వ్రేలాడుచున్న చెవులుగూడ దానితోడ వచ్చును గాన తద్గుణసంవిజ్ఞానమని చెప్పఁదురు- చిత్రగుః ఇత్యాదికము అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి- చిత్రగుమ్ ఆనయ = చిత్రములైన యావులుగలవాని తెమ్ము అనునప్పుడు ఆవులు వానితోఁగూడ రానక్కఱలేదు- వాఁడు మాత్రమె వచ్చినఁ జాలును- కాఁబట్టి ఇది అతద్గుణసంవిజ్ఞానబహువ్రీహి- ప్రకృతమున జన్మము మొదలుగాఁగల స్థితిప్రళయములె కాక జన్మము కూడ బ్రహ్మముతో నన్వయించును గాన ఇదియును తద్గుణసంవిజ్ఞానబహువ్రీహియె) అస్య = దీనికి అనఁగా ఊహింపశక్యముగా* యనేక విధములై విచిత్రములగు రచనలు గలదియును, వారి వారికి వేఱు వేఱుగా నేర్పడియున్న ప్రదేశములు కాలములు ఫలానుభవములును గల బ్రహ్మ మొదలు గడ్డికాడవఱకును గల జీవులతోఁ గలసియున్నదియు నగు జగత్తునకు అనుట- యతః = ఎవ్వనివలన అనఁగా అన్నిటికి నేలికయును హేయములన్నిటికి విలక్షణమైన స్వరూపము గలవాఁడును సత్యసంకల్పుఁడును జ్ఞానము ఆనందము మొదలగు ననంతములైన కల్యాణగుణములు కలవాఁడును సర్వజ్ఞుఁడును సర్వశక్తియును పరమకారుణికుండు నగు నేపరమపురుషునివలన సృష్టిస్థితి ప్రళయములు ప్రవర్తింపుచున్నవో అతఁడె బ్రహ్మమని సూత్రార్థము-

౩. (తైత్తి॥భృగు॥౧అను) భృగుర్వై వారుణిః॥ వరుణం పితర

ముపససార। అధీహి భగవో బ్రహ్మేతి (వరుణునికొడుకు భృగువు, తం
డ్రియైన వరుణుని యొద్దకు పోయెను- ఓస్వామీ! బ్రహ్మమును నే
ర్పుము అనియడిగెను) అని మొదలు పెట్టి, (తై॥ భృ॥౧అను॥) యతో
వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ప్ర
యన్త్యభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ (దేనివలన ఈ
భూతములు పుట్టుచున్నవో, పుట్టినవై దేనివలన బ్రతుకుచున్నవో,
దేనిని పొందినవై లయమును బొందుచున్నవో, దానిని విచారింపుము-
అది బ్రహ్మము) అని శ్రుతి కలదు-

౪. అందు సందేహము- ఈ వాక్యమువలన బ్రహ్మమును లక్షణముతోఁ దెలిసికొనుటకు శక్యమగునా? కాదా; అని-

౫. ఎట్లు చెప్పవలసియున్నది; శక్యము కాదని- (లక్షణములు [Definitions) విశేషణములనియును ఉపలక్షణములనియును రెండువిధములు- నల్లనివాఁడు దేవదత్తుఁడు అని చెప్పినపుడు నల్లదనము దేవదత్తుని సర్వకాలములయందు నాశ్రయించియె యుండునుగాన ఇది విశేషణమనఁబడును- ఈసారసపక్షివ్రాలియున్నదియె దేవదత్తుని పొలము అనునప్పుడు సారసపక్షి సర్వకాలములయందును ఆపొలమునందుండక కొంతకాలమె యుండునుగాన ఆ పొలమునకు సారసపక్షి ఉపలక్షణము-] జన్మాదులు బ్రహ్మమునకు విశేషణలక్షణములు కావు- జన్మాదులు అనేకములు గాన ఒక్కొక్క విశేషణము ఒక్కొక్క బ్రహ్మమును చెప్పున అనేక బ్రహ్మములను ఏర్పఱుచును- విశేషణమనఁగా వ్యావర్తకముగదా- వ్యావర్తకమనఁగా తాను దేనికి లక్షణమో అది మిగిలిన వస్తువులు కాకపోవుటను సాధించునది- నల్లనివాఁడును యౌవనముకలవాఁడును ఎఱ్ఱనికండ్లు కలవాఁడును సమపరిమాణుఁడు అనఁగా పొట్టివాఁడునుపొడుగువాఁడునుకానివాఁడును దేవదత్తుఁడుఅనునప్పుడు అనేకవిశేషణములుకూడనొకదేవదత్తునినె తెలియఁజేయుచున్నవి, అట్లె ఇచ్చటఁగూడబ్రహ్మమొక్కటియె కావచ్చుననంటేని, అట్లు కాదు- అచ్చట మఱియొక్క ప్రమాణమువలన అనఁగా కండ్లతో చూచుట మొదలగుదానివలన ఒక్కఁడని తెలిసియున్నదిగాన ఆయొక్కనియందె విశేషణములన్నియును చేరుచున్న

వి. అట్లు లేనిచో నచ్చటగూడ విశేషణములు వ్యావర్తకములుగాన అనేకులు కావలసియే వచ్చును. ప్రకృతమున నీవిశేషణములతో లక్షణము చెప్పఁబడవలసిన బ్రహ్మము మఱియొక్క ప్రమాణముచేత నొక్కటియని తెలియఁబడుట లేదుగాన విశేషణములు అనేకములగుటచేత అనేక బ్రహ్మములు కావలసియుండుట తప్పదు. బ్రహ్మశబ్దమొక్కటియె కాన బ్రహ్మమొక్కటియె యగుట తోఁచునే యన్నను, అట్లు కాదు. గోవు నెఱుంగనివానికి ఖణ్డో ముణ్డః పూర్ణశృఙ్గో గౌః (మొండియావు, బోడియావు, నిండుకొమ్ములయావు) అని యిట్లు చెప్పినతోడనె గౌః అనునది యొక్కటియైనను ఖణ్డత్వము మొదలగు విశేషణముల భేదమున గోవ్యక్తులు అనేకములగుట తోఁచునుగాన ఇచ్చట బ్రహ్మస్వరూపములుగూడ అనేకములు కావలయును. కావునని లక్షణము చెప్పుటకుద్దేశింపఁబడిన వస్తువునకు ఇవి (జన్మాదులు) అన్నియును చేరి ఒక్క లక్షణమగుటయును సంభవింపదు.

౬. ఈజన్మాదులు ఉపలక్షణములవెడి లక్షణములగుటయును సంభవింపదు. బ్రహ్మమునకు ఇవితప్ప మఱియాకారము కానఁబడదు. ఒక్క యాకారమునఁ దెలియఁబడినదానిని మఱియొక్క యాకారమునఁ దెలిసికొనుటకై ఉపలక్షణము పనికివచ్చును. ఈసారసపక్షి యెచ్చట నున్నదో అది దేవదత్తుని పొలము అనుచోట పొలము అనెడి యొక్క యాకారము తెలిసియున్నపై సారసపక్షి సంబంధము కలిగియుండుట యనెడి యుపలక్షణము దేవదత్తునిదగుట యనెడు మఱియొక్క యాకారమును దెలియఁజేయుచున్నది. (తై॥ ఆ॥౧॥) సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ (సత్యస్వరూపమైనదియును జ్ఞానస్వరూపమైనదియును అంతములేనిదియును బ్రహ్మము) అను శ్రుతిచేఁ దెలియఁజేయఁబడిన యాకారముగల బ్రహ్మమునకు జన్మాదులు ఉపలక్షణములు కావచ్చునేయన్నను, అట్లు కాదు. ఇదిగూడ లక్షణవాక్యమె కాన యతో వా ఇమాని యనెడి లక్షణవాక్యమునకును దీనికిని అన్యోన్యాశ్రయము వచ్చును. ఎట్లన్నను. సత్యం జ్ఞాన మనెడి వాక్యములోఁ జెప్పినవి యుపలక్షణమగుటకు మఱియొక్క యాకారము కావలసియుండునుగాన జన్మాదులకె అట్టి యాకారము

గా నన్వయింపవలయును- జన్మాదులుకూడ నుపలక్షణములై కానవానికి మఱియొక్క యాకారము కావలసియుండును- అట్టియాకారములుగా సత్యజ్ఞానాదికము అన్వయింపవలసియుండును-

౭. కాఁబట్టి లక్షణముతో బ్రహ్మమును తెలిసికొనుటకు శక్యముకాదు-

౮. ఇట్లు పూర్వపక్షము రాగా సిద్ధాంతము చెప్పఁబడును-

౯. జగత్తును సృజించుటయు నిలువబెట్టుటయు సంహరించుటయు ననునివి యుపలక్షణములుగా బ్రహ్మమును తెలిసికొనవచ్చును- మఱియొక్క యాకారము లేదేయన్నను, కలదు- మిక్కిలిగొప్పదియగుటయును విస్తరింపఁజేయునదియగుటయు నట్టియాకారము- బ్రహ్మశబ్దమునకు మిక్కిలి గొప్పదియును విస్తరింపఁజేయునదియునని యర్థము- బృహ ధాతువునకదియెకదా యర్థము అట్టియాకారముగల బ్రహ్మమునకు జగత్తును సృజించుటయును నిలుపుటయును సంహరించుటయు నుపలక్షణములు- దేనివలనఁబుట్టుచున్నవో, దేనిచేతఁబ్రతుకుచున్నవో, దేనిఁ జేరుచున్నవో, అది, అని ప్రసిద్ధమైనట్లు చెప్పుటవలన మిగిలిన శ్రుతులలోని ప్రసిద్ధియెట్లున్నదో అట్లె జన్మాదులకు కారణమగునది యనువదింపఁబడుచున్నది- (అనువదించుటయనఁగా నొక్కమాఱు చెప్పఁబడినదానిని తిరిగియు జెప్పుట. విధియనఁగా క్రొత్తదానిని చెప్పుట)

౧౦. అప్రసిద్ధి యెచ్చటనన్నను-

(ఛాం॥౬॥౨॥౧) సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమే వాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోసృజత (ఓసోమమునకుఁ దగినవాఁడా! ఇది మొదటను సత్తె అయియుండెను- ఒక్కటియె అయి యుండెను- రెండవది లేనిదైయుండెను- అది తాను అనేకములు కావలయుననియును సృష్టిని బొందవలయుననియును జూచెను, అది తేజస్సును సృజించెను) అనుశ్రుతిచేత సత్తు అని చెప్పఁబడెడి యొక్కటియె నిమిత్తంబు నుపాదానమునని చెప్పఁబడినది- నిమిత్తంబు నుపాదానంబునగుట యెట్లు చెప్పఁబడినది యన్నను, దీని మొదటను సత్తు ఒక్కటియె యుండెను అని ఉపాదానమగుటను

తెలియఁజేసి రెండవదిలేనిదై యుండెననుటచే మఱియొక్క అధిష్ఠాత (కర్త) లేకపోవుటను చెప్పి, అది తాను అనేకములు కావలయును సృష్టిని బొందవలెను అనిసంకల్పించెను, అది తేజస్సును సృజించెను అనియొక్కటియె చెప్పఁబడెను.

౧౧. కాఁబట్టి జగత్తుపుట్టుటయు నిలిచియుండుటయు లయమును బొందుటయును దేనిమూలముగా జరుగునో యది బ్రహ్మము అనియిట్లు జన్మస్థితిలయములు, తనకు నిమిత్తంబు నుపాదానంబు నగు వస్తువు బ్రహ్మమని తెలియఁజేయుచున్నది. జగత్తులకన్నిటికిని నిమిత్తంబు నుపాదానంబు నగునది అన్నిటి నెఱింగినదియును బీరువాని సంకల్పముకలదియును విచిత్రములైన శక్తులు కలదియును కావలయునుగాన సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వవిచిత్రశక్తిత్వములు మొదలుగాఁగల గొప్పయాకారముకలదిగా బ్రహ్మము తెలియఁబడును. అట్టియాకారముగలదిగాఁ దెలియఁబడిన బ్రహ్మమునకు జన్మాదులు లక్షణము కావచ్చును. కాఁబట్టి మఱియొక్క యాకారము తెలియఁబడకున్నది యనెడి యనుపపత్తి లేదు.

౧౨. జగజ్జన్మాదులు విశేషణములుగా లక్షణములైనను తప్పులేదు. లక్షణములైనను, విశేషణములు, వస్తువును,దానికంటె విలక్షణములగు వానికంటె నది వేఱు అనియేర్పఱచుచును. స్వరూపమేమియు దెలియని వస్తువునకు లక్షణమును చెప్పఁదలంచినను, అన్యోన్యము విరోధములేని అనేకవిశేషణములను లక్షణముగాఁజెప్పట,ఆవస్తువులు అనేకములని తెలియఁజేయఁజాలదు. ఆవిశేషణములన్నియు నొక్కదానివె యని తెలియుటవలన ఒక్కవస్తువె తేలును. మొండితనము బోడితనము మొదలగునవియు, పరస్పర విరోధమువలనగో వ్యక్తులు అనేకములగుటనేర్పఱచుచును. ప్రకృతమున కాలభేదము నుపట్టి జన్మాదులకు విరోధము లేదు.

౧౩ యతోవా ఇమానిభూతాని జాయన్తే ఇత్యాదికారణవాక్యమున జన్మాదికారణముగాఁ దెలిసిన బ్రహ్మమునకు, సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మ అని మిగిలిన వస్తువులన్నిటికంటెవేఱుగానున్న స్వరూపము చెప్పఁబడుచున్నది.

౧౪. అందు సత్యపదము ఎప్పుడు నొకటే విధముగా నుండెడి బ్రహ్మమును జెప్పుచున్నది. దీనివలన వికారములుగల యచేతనంబును దానితోఁ జేరియుండెడి జీవుఁడును కాకపోవుట తెలియఁ జేయఁబడుచున్నది. అవి వేలు వేలు పేరులు గలుగుటకుఁ దగిన యనేకయవస్థలను కలిగియుండుటను ఎప్పుడు నొకటే విధముగా నుండుట లేదు. జ్ఞానపదము ఎప్పుడును తగ్గుటలేని జ్ఞానమె స్వరూపముగాఁ గలుగుటను చెప్పుచున్నది. దీనివలన కొంతకాలము జ్ఞానము తగ్గియుండిన ముక్తుఁడు కాకపోవుట తెలియఁ జేయఁబడుచున్నది. అనంతపదము దేశపరిచ్ఛేదంబును కాలపరిచ్ఛేదంబును వస్తుపరిచ్ఛేదంబును లేని స్వరూపమును చెప్పుచున్నది (దేశపరిచ్ఛేద మనఁగా ఈచోటనుండునదియని చెప్పఁదగియుండుట. కాలపరిచ్ఛేద మనఁగా ఇంతకాలముండునదియని చెప్పఁదగియుండుట. వస్తుపరిచ్ఛేద మనఁగా ఈవస్తువును పోలినదని చెప్పఁదగియుండుట) భగవంతుని స్వరూపము గుణములతోఁ గూడినదిగాన గుణములను పట్టియు స్వరూపమును పట్టియు అనంతమైనదని తెలియఁజేయఁబడు చున్నది. వెనుకటి విశేషణముల చేత నిషేధింపఁబడిన సంసారులు ముక్తులు అనెడి రెండువిధముల వారును గాని నిత్యులు కాకపోవుట ఈవిశేషణము చేఁ దెలియఁ జేయఁబడుచున్నది. నిత్యుల స్వరూపముకంటెను గుణములకంటెనను అతిశయించిన స్వరూపగుణములు కలవాఁ డొకఁడు కలఁడుగాన వారికిని యనంతత్వము లేదు. (నిత్యులనఁగా ఎన్నఁడును సంసారగంధము నెఱుఁగని అనంతగరుడ విష్వక్సేనాదులు. వారు ఎప్పుడును వైకుంఠమునందెయుందురు) విశేషణము లనునవి వ్యావర్తకములు (మిగిలినవి కావని తెలియఁ జేయునవి) గాన సంసారులు మొదలగువారు కాకపోవుటను సత్యాదిశబ్దములు చెప్పుచున్నవి.

౧౫. కాఁబట్టి సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యనువాక్యముచేత జగత్సృష్టి మొదలగువానికిఁ దెలియఁబడిన స్వరూపముగల బ్రహ్మము మిగిలిన వానియన్నిటికంటె విజాతీయమైనదని నిరూపింపఁబడుచున్నదిగాన నన్యోన్యాశ్రయము లేదు.

౧౬. కాఁబట్టి సమస్తజగత్తులును పుట్టుట మొదలగువానికి

కారణమైనదియును, నిర్దోషమైనదియును సర్వజ్ఞమును సత్యసంకల్పమును సర్వశక్తియునగు బ్రహ్మము, లక్షణములతోఁ దెలిసికొనుటకు శక్యమగునని యేర్పడినది.

౧౭. నిర్విశేషవస్తువె విచారింపఁదగినదని చెప్పువారి మతమున బ్రహ్మజిజ్ఞాసా, జన్మాద్యస్యయతః (బ్రహ్మవిచారము చేయఁబడుచున్నది. దేనివలన నీజగత్తునకు జన్మాదికము కలిగినదో అదిబ్రహ్మము) అనునది అసంగతమగును. మిక్కిలి గొప్పదియును విస్తరింపఁజేయునదియును బ్రహ్మము అనికదా నిర్వచనము (Derivation). అబ్రహ్మము జగత్తుపుట్టుట మొదలగు దానికి కారణమనికదా చెప్పఁబడినది.

౧౮. ఇట్లె ఉత్తరసూత్రములయందును సూత్రములలోను దాహరింపఁబడిన శ్రుతులయందును ఈక్షణము (సంకల్పము) మొదలగునవి యన్వయించుట కానఁబడుచున్నదిగాన ఆసూత్రములును ఆసూత్రములలో నుదాహరింపఁబడిన శ్రుతులును నిర్విశేషవస్తువును తెలియఁజేయునవి కావు.

౧౯. తర్కము (యుక్తి) గూడ, సాధింపవలసిన దానిని తప్పకయనుసరించియుండెడి హేతువు (లింగము) గలవస్తువును గురించినదైయుండునుగాన నిర్విశేషవస్తువును తెలియఁజేయునది కాదు.

౨౦. జగత్తుపుట్టుట మొదలగు భ్రాంతులు దేనివలనఁగలుగునో అదిబ్రహ్మమని తాముకల్పించికొని యున్నరీతినిగూడ నిర్విశేషవస్తువు సిద్ధింపదు. భ్రాంతికి మూలము అజ్ఞానమనియును, అజ్ఞానమునకు సాక్షియైనది బ్రహ్మమనియును అంగీకరించియె యున్నారుగదా. సాక్షియగుటప్రకాశమెస్వరూపముగాఁగలవాఁడగుటచేతగదా చెప్పఁబడుచున్నది. ప్రకాశత్వమనునది జడముకాదని తెలియఁజేయునది. అదితన్నుమిగిలినదానినిగూడ వ్యవహరించుటకుఁ దగినవానిగాఁజేసెడి స్వభావమువలనఁ గలుగుచున్నది. అట్టిదయినతో డనె సవిశేషమె యగును. సవిశేషముగానిచో ప్రకాశమగుటయె లేకపోవును. తుచ్ఛమెకావఁయును.

---

౧. జగత్తు పుట్టుట మొదలగుదానికి కారణమైన బ్రహ్మ మె వేదాంతములంౘెలియఁదగినదని చెప్పఁబడినది- అది సరికాదు- ఆబ్రహ్మము శాస్త్రముచేతఁ దెలియఁబడవలసినదికాదు- అనుమాన చేతనె సిద్ధించును- అని శంకించికొని చెప్పుచున్నాఁడు.

సూ-శాస్త్రయోనిత్వాత్-॥౩॥

అర్థము- శాస్త్రయోనిత్వాత్= శాస్త్రమె ప్రమాణము గాఁగలదిగాన (వేదాంతములచేఁ దెలియఁదగినది)

౨. శాస్త్రం యస్య యోనిః తత్ శాస్త్రయోని=శాస్త్రము దేనికి కారణమో అనఁగా ప్రమాణమో అది శాస్త్రయోని- దానిభా వము శాస్త్రయోనిత్వము- అనఁగా శాస్త్రప్రమాణకమగుట- శా స్త్రయోనిత్వాత్=అట్టిదగుటవలన- శాస్త్రము బ్రహ్మమును తెలిసి కొనుటకు సాధనముగాన బ్రహ్మమునకు శాస్త్రయోనిత్వము కలిగిన ది- బ్రహ్మము బొత్తిగా ఇంద్రియములచేఁ దెలియఁబడనిది యగుట ను శాస్త్రమును బట్టియె తెలిసికొనవలసినదిగాన వెనుకఁజెప్పినట్టి స్వరూపముగల బ్రహ్మమును యతోవా ఇమాని భూతానిజాయన్తే ఇ త్యాద్యుపనిషద్వాక్యములు తెలియఁజేయునని యర్థము-

౩. బ్రహ్మము ఇతరప్రమాణములచేతఁ దెలియఁబడునుగాన శాస్త్రయోనిత్వము సంభవింపదు- శాస్త్రమెప్పుడును మిగిలిన ప్ర మాణమునకు దేనికేని ప్రాప్తిలేనిదానినె ప్రమాణమగును- అనిపూ ర్వపక్షము-

౪. ఇచ్చట మీమాంసకుఁడు చెప్పునదియేమన్నను- ఆబ్రహ్మ మును గూర్చినది మిగిలినప్రమాణమేది? ప్రత్యక్షము ప్రమాణముకా దు- ఆప్రత్యక్షము ఇంద్రియములవలనఁ గలిగినదియును యోగాభ్యా సమువలనఁ గలిగినదియునని రెండువిధములు- ఇంద్రియములవలనఁగ లిగెడి ప్రత్యక్షముగూడ వెలుపటి ఇంద్రియములవలనఁగలుగునదియు ను లోపటి ఇంద్రియములవలనఁ గలుగునదియునని రెండువిధములు- (వెలుపటి ఇంద్రియములు కన్ను మొదలుగునవి- లోపటి ఇంద్రియ ము మనస్సు) బాహ్యేంద్రియములు (వెలుపటిఇంద్రియములు) ఆ కాలమున తనతో సంనికర్షము (సంబంధము) కలిగి తెలియఁబడఁ

దగిన తమవిషయమును తెలియఁజేయునవి. (విషయము = A thing
or an object) కాఁబట్టి యన్నిపదార్థములను ప్రత్యక్షముగాఁదెలి
సికొనుటకును వానిని నిర్మించుటకును సమర్థుఁడగు పరమపురుషుని
తెలియఁజేయునవికావు. మనస్సువలనఁగూడ తెలిసికొనుటలేదు. ఆ
మనస్సు సుఖము దుఃఖము మొదలగు లోపటి విషయములనుకాక వె
లుపలివిషయములను దెలియఁజేయుటకు వెలుపటిఇంద్రియముల సహా
యములేక పనిచేయఁజాలదు. యోగమువలనఁ గలిగెడి ప్రత్యక్షము
గూడ సాధకముకాదు. భావనచేయఁగా జేయఁగాఁగలిగెడి యా
ప్రత్యక్షము తేటగా ప్రత్యక్షమువలెనుండినను పూర్వము తానెఱిం
గియున్నదానిని తలంచుటయెయగునుగాన అది ప్రమాణముగునఁగా
ఒకట వస్తువిట్టిది యని నిజముగాఁ దెలియఁజేయునదికాదు. ఇఁకన
ది ప్రత్యక్షమెట్లగును? ప్రత్యక్షముగా చూడనిదానియందు ఆయోగ
జప్రత్యక్షము కలుగుటకు సాధకము కానరాదు. అట్లైనబోనది భ్ర
మరూపముకావలసివచ్చును.

౫. విశేషతోదృష్టముకాని సామాన్యతోదృష్టముకానియ
గు ననుమానముగూడ ప్రమాణము కాదు. ఇంద్రియాగోచరముకాని
వస్తువునందు సంబంధమును నిశ్చయించుట కలుగదుగాన విశేష
తోదృష్టమగు హేతువు సంభవింపదు. అన్నివస్తువులను ప్రత్యక్ష
ముగాఁదెలిసికొనుటకును వాని నిర్మించుటకును గూడసమర్థుఁడ
గు పురుషునియందు నియతముగానుండెడి సామాన్యతో దృష్టమైన
హేతువుగూడ కనఁబడదు. (తానుపూర్వము చూచియున్న హేతు
వునుబట్టి సాధ్యమును సాధించునెడను విశేషతో దృష్టము. తాను
పూర్వము చూచియున్నదాని జాతిలోఁజేరినదానిబట్టి సాధించునెడ
ను సామాన్యతోదృష్టము. ఎట్లన్నను తానుపూర్వము ఒకట యా
వునుచూచియుండి ఆలోకమాత్రము కనబడుటనుబట్టి యావున్నదని
యూహించును. ఇచ్చట విశేషతో దృష్టము. తాను వంటయిల్లు మొ
దలగువానిలో పొగను చూచినప్పుడెల్ల నిప్పును చూచుచుండుటవల
న కొండమీదను కూడ పొగనుచూచి నిప్పును ఊహించును. అయితే
తాను వెనక చూచిన పొగలలో నొకటియైనను ఈపొగకాదు. అయిః

ప్పటికిసీఆజాతిలోనిది గాన నిప్పుఉండవలయునని యూహించును- ఇ
ప్పట సామాన్యతో దృష్టము)

౭. జగత్తు అనేకావయవములు గలదిగాన దానియందు కార్యత్వము కలదు- కార్యమనఁగా చేయఁబడునది- అట్టిది యొక్క- కర్తను కలదై యుండును- ఆకర్త ఆకార్యమునకు ఉపాదానము ఏదియో, ఉపకరణములెవ్వియో, సంప్రదానమునేదియో, ప్రయోజనమేదియో, వీనినన్నిటి నెఱింగిన వాఁడై యుండవలయును- (ఉపాదానమనఁగా కుండకు మన్నువంటి కారణము- ఉపకరణములు పనిముట్లు- సంప్రదానమనఁగా ఆకార్యము ఎవ్వనికొఱకో వాఁడు అనఁగా ఆకార్యమునకు భోక్తయనుట) కాఁగా కార్యత్వమనెడి హేతువు ఇట్టి కర్తకలదియగుటయనెడు సాధ్యమును సాధించును- లోకములో కుండ మొదలగు కార్యములు ఇట్టి కర్తకలవిగానె కనఁబడుచున్నవి- ఇదిగాక జగత్తునందు అచేతనారబ్ధత్వము అనఁగా అచేతనవస్తువుయొక్క వికారమగుటకలదు- అచేతనారబ్ధమైన దెల్ల నుఒక్క చేతనునకు ఆధీనముగా నుండుట కానఁబడుచున్నది- కాఁబట్టి జగత్తునందుండెడి అచేతనారబ్ధత్వము ఏకచేతనాధీనత్వమును (ఒక్క చేతనునకు అధీనమైయుండుటను)సాధించును- కాఁబట్టి ఈ రెండు హేతువులు కలవే యన్నను, చెప్పెదము- ఒక్క చేతనునకు అధీనమైయుండుట యనఁగా నేమి? వానికి అధీనముగాఁబుట్టి వానియధీనముగానె యుండుట యనఁగూడదు- అట్లు చెప్పినచో నీవిచ్చిన దృష్టాంతమున నీసాధ్యము లేకపోవును- రోగములేకుండనుండెడి మనశరీరము పుట్టుటయు నుండుటయు నొక్క చేతనుని యధీనములు కావు- ఆశరీరమువలన సుఖించెడి భార్య మొదలయినవారి యందలి యదృష్టమును పట్టియె ఆశరీరము పుట్టుటయు నుండుటయును కలుగును- ఇంతియెకాక శరీరమనెడి యవయవి (అనేకయవయవములు గలయొక్క వస్తువు) తన యవయవములయందు సమవేతమగుటయె శరీరముండుట యనికదా మీరు చెప్పుదురు- అందుకు అవయవములన్నియును చేరియుండుటయె కావలసినది కాని చేతనునియపేక్ష యేమియునులేదు- ఇఁకశరీరము బ్రతికియుండుట శరీరమునకలుగు

యని చెప్పినచో నట్టిస్థితి ప్రకృతమునపక్షమైన (వివాదాస్పదమైన) భూమి సముద్రము పర్వతములు మొదలగుదానియందె సంభవింపదు గాన అన్నిటియందునుండెడి స్థితి (నిలిచియుండుట) యను నది యప్రసక్తమన్నది (తార్కికమతములో అవయవమువేఱు అవయవివేఱు. ఎట్లన్నను- రెండు కపాలములను[పెంకులను] చేర్చి యొక్కకుండగాఁ జేయునప్పుడు ఆకపాలములు అవయవములు- కుండ అవయవి- కుండగానైన తరువాతఁగూడ ఆపెంకులు ఉండనే యున్నవి గాన, ఆపెంకులనెడి అవయవములయందు కుండయనెడి యొక్క అవయవి కొత్తగాఁ గలిగియున్నది- ఆకపాలములు ఆకుండకు ఆధారము- వానికిని దీనికిని సంబంధము సమవాయము- ఇందుసమవాయ సంబంధము చేత కుండయనెడి అవయవి కపాలములయందు ఉన్నదిగాన కుండను సమవేతమని చెప్పుదురు. ఇట్లే శరీరము కూడ దాని యవయవములయందు సమవేతమని చెప్పఁబడును) వానికి అధీనమైన ప్రవృత్తికలుగుటయె వానికి అధీనముగుటయంటి రేని, అనేకులు చేరి సాధింపవలసిన పెద్దరథములు రాతిపలకలు పర్వతములు మొదలగు వానియందు వ్యభిచారముకలుగును (వ్యభిచారమనఁగా హేతువున్నను సాధ్యము లేకపోవుట- ప్రకృతమున అచేతనవస్తువులచేఁ గలుగుటయనెడి హేతువు పర్వతాదులయందున్నను ఒక్క చేతనునికి యధీనమైయుండుట యనెడు సాధ్యము లేదుగాన వ్యభిచారము)ఒక్క చేతనునకనక చేతనుఁడైనవానికి అధీనమైయుండుట సాధ్యమన్నచో సిద్ధసాధనము(అనఁగా ఇప్పటికిసిద్ధమైన యంశమేకాన సాధింపనక్కఱలేదనుట- ఎట్లన్నన- అచేతనములు అనేకచేతనుల యధీనములైయుండుటను మీమాంసకులుగూడ నొప్పియె యున్నారు)

౬. ఇంతియెకాక ఉభయవాదులు నొప్పుకొనిన జీవులనే కర్తలనుగా నొప్పుట యుక్తముగా నున్నది- జీవులు వెనుకఁజెప్పఁబడిన యుపాదానాదులను ఎఱుంగరుగాన కర్తలగుట సంభవింపదనుట సరికాదు- అందఱుజీవులును జగత్తునకు ఉపాదానమగు పృథివి మొదలగువానిని ఉపకరణములగు యాగాదులనును తెలిసికొను సామర్థ్యముకలదు- (యాగవిశేషములు తపస్సు మొదలగువా

వినిచేసి జగత్తును సృజింపఁగల సామర్థ్యమును సంపాదించి
వులుజగత్తును సృజింపవచ్చునని తాత్పర్యము) ఇప్పుడుకూడ వృష్టి
మొదలగువానిని యాగము మొదలగువానినిగూడ అందఱు నెఱుం
దురు- ఇట్టి యాగాదులఁ జేయఁదగిన యదృష్టము తనకున్నదో లేదో
తెలియకపోయినను చేతనులు కర్తలగుటకు బాధకములేదు కార్యము
కలుగుటకు అది తెలియుటతోఁ బనిలేదు- ఆయాగాదుల తెలివియే కా
వలసినది- ఆయాగాదికమునకు ఆకార్యమును కలిగించెడి శక్తియు
న్నదని తోఁచుటమాత్రమె చాలును- ఆశక్తి మనకుఁ గనపడకున్ననులే
దు- కుమ్మరి మొదలగువాఁడు) తమ కార్యమునకు సాధనములగు దం
డము (కఱ్ఱ) చక్రము (కుమ్మరిసాన) మొదలగువానిని ప్రత్యక్షము
గాఁ జూచినట్లు వానికిఁగలశక్తినిగూడ ప్రత్యక్షముగాఁ జూచియె కుం
డ బాన మొదలగువానిని ఆరంభించుటలేదే- ప్రస్తుతము ఆగమము
(శాస్త్రము) వలన యాగాదులకిట్టి శక్తికలదని యెఱిఁగియున్న చేత
నులు (జీవులు) కార్యమును చేయుటకు బాధకములేదు-

౮. ఇంతియేకాక ఎట్టిది చేయుటకు శక్యమగునో, ఎట్టిదాని
యుపాదానములను తెలిసికొనఁజాలుదుమో యట్టిదె ఆయుపాదానా
దుల నెఱింగినవానిచేఁ జేయఁబడుటను చూచుచున్నాము- భూమి,
పర్వతములు, సముద్రములు మొదలగునవి మనము చేయశక్యము
కానివి- వానియుపాదానములను ఎఱుఁగశక్యములుకావు- కాఁబట్టి
అవి చేతనుఁడు కర్తగాఁగలవికావు- కాఁబట్టి కుండ బాన మొదలయి
నవానివంటి శక్యమైన వస్తువులయందుండెడి కార్యత్వమె, తెలివి
గలవాఁడు కర్తయగుటను స్థాపించఁగలదు-

౯. ఇంతియేకాక కుండ మొదలగు కార్యములు ఈశ్వరుఁడుకా
నివాఁడును స్వల్పమైన తెలివియును స్వల్పమైనశక్తియును గలవాఁడు
ను శరీరముకలవాఁడును ఉపకరణములు కలవాఁడును కోరికకలవాఁడు
నగువానిచేత నిర్మింపఁబడుట కానఁబడుచున్నది కాఁబట్టి ఈకార్య
త్వహేతువు అట్టిచేతనునే కర్తనుగా సాధించును- కాఁగా మీరుసా
ధింపఁగోరిన పురుషుని సర్వజ్ఞత్వము సర్వైశ్వర్యము మొదలగు వా
నిని సాధింపక, వానికి విరుద్ధములైన గుణములను సాధించుటచే మీ

